# బుద్ధోపదేశము

బుద్ధం శరణం గచ్ఛామి

ధర్మం శరణం గచ్ఛామి

సంఘం శరణం గచ్ఛామి




విద్వాన్

కోగంటి నరసింహా రావు



AMMA FOUNDATION

Regd No: 195/05

Ukkungaram, Visakhapatnam



# అంకితం

మా పితృమూర్తి

నాస్తికుడు హేతువాది అభ్యుదయవాది బుద్దిష్టు సామాజిక చైతన్య

మూర్తి  దార్శనికుడు మచ్చలేని మనిషి సరసవచోమాధుర్య

బోధామృత ఆదర్శోపాధ్యాయులు

**శ్రీ కోగంటి నరసింహా రావు** గారికి,

మా మాతృదేవత సౌశీల్యవతి ప్రేమమూర్తి సహనగుణి సౌమ్యరూపి

స్నేహశీలి పరోపకారిణి  కష్టజీవి శక్తిస్వరూపిణి

**శ్రీమతి రాజ్యలక్ష్మి** గారికి

మరువలేని మరపురాని జ్ఞాపకాలతో,

**కుటుంబ సభ్యులు**

# బుద్ధోపదేశము



బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి



**రచయిత:**
**విద్వాన్ కోగంటి నరసింహా రావు**



తాత్పర్యం:
**అవధానం. టి. హెచ్. నటరాజారావు**





Buddhopadesamu, 101 metered poems in Telugu, first published in 1956, reprinted in 2023 on the occasion of birth centenary celebrations of Sri Koganti Narasimha Rao...

బుద్ధోపదేశము, బుద్ధుని బోధనలపై ఛందోబద్ధమైన 101 పద్యాలు, 1956 లో తొలి ప్రచురణ, రెండవ ముద్రణ 2023లో శ్రీ కోగంటి నరసింహారావు గారి శతజయంతి సందర్భంగా...

తొలి ముద్రణ:

దుర్ముఖి–వైశాఖ పూర్ణిమ, 1956
ప్రతులు : 1000
నేషనల్ ప్రింటింగ్ ప్రెస్, తెనాలి
ప్రచురణ : కవిరాజ గ్రంథమాల, తెనాలి
వెల: 0_6_0

Typeset, Page design & Cover design by : Sampath Raja Ram, Rahman

1st Reprint : January, 2023

Copies : 500

Price : ₹. 60/-

Printed at : SriSri Printers, Vijayawada

Publishers address:




1. K. Lenin Babu
Mob-75694 73208
H No 31-58-56/9/B
Mathrusree Nagar
Vuda Phase -7
Kurmannapalem
Visakhapatnam - 530046. A.P

2.Dr.Usha Rani Koganti
Mob-8179611745
31/3, Madhu Park Ridge
Hashim Nagar
Langarhauz
Hyderabad -500031

## ధర్మదార్శనికుడు
# కోగంటి నరసింహా రావు గారు

బుద్ధజయంతి వైశాఖ పున్నమిరోజు. ఐతే... బుద్దుని జననం ఏ సంవత్సరంలో జరిగింది అనేది తేలని సమస్యే. ప్రపంచ వ్యాపితంగా బౌద్ధులు నాలుగు వేర్వేరు సంవత్సరాల్ని లెక్కిస్తూ ఉంటారు. ఈ సమస్యను అంతర్జాతీయ బౌద్ధ సంఘం ఒక ముఖంగా తేల్చింది. 1956లో జరిగిన బుద్ధ జయంతిని 2500వ బుద్ధ జయంతిగా నిర్ణయించింది. అందుకే... బోధిసత్వ డాక్టర్ బాబాసాహెబ్ అంబేడ్కర్ 1956లో అశోక విజయ దశమి రోజున బౌద్ధ దీక్ష స్వీకరించారు.

ఆ సంవత్సరం ప్రపంచ వ్యాపితంగా కొన్ని వేల బుద్ధ జయంతులు జరిగాయి. నాటి భారత ప్రధాని నెహ్రూ, రాజ్యాంగ నిర్మాత అంబేడ్కర్లు ఇద్దరూ బౌద్ధ అభిమానులు. కాబట్టి మన దేశంలో కూడా ప్రగతిశీల శక్తులు, ప్రభుత్వాలు పెద్దఎత్తున బుద్ధ జయంతులు నిర్వహించాయి.

మార్క్సిజం స్పర్శ ఉన్న వారంతా మత మౌఢ్యానికి వ్యతిరేకులే. సమతా, సమరసతా భావాలకి గాఢాభిమానులే! ఆ ప్రగాఢ అభిమానానికి మచ్చుతునకే ఈ పద్య కావ్యం. ఈ పద్య కావ్య రచయిత **కోగంటి నరసింహా రావు** గారు. వారు అభ్యుదయ వాది. మార్క్సిస్టు. తెలుగు పండితులు. ఆదర్శ ఉపాధ్యాయులు. అన్నింటికీ మించి బౌద్ధాభిమాని. మంచి పద్య రచయిత. అందుకే ఈ రచన అంత హృద్యంగా చేయగలిగారు.

తెలుగు భాష అందాన్ని ఇనుమడింపచేసే రచన యిది. ప్రతి పద్యంలో బౌద్ధ ధర్మామృతం తొలకరించింది. ప్రతి పుట సద్ధమ్మ సాహిత్య పరిమళాలు చిలకరించింది. చదువుతుంటే మనస్సు పులకరించింది. బౌద్ధాన్ని చాలా మంది సంస్కరణ వాదంగానే చూశారు. కానీ, అది భారత దేశ సామాజిక విప్లవ కెరటం. దాన్ని రాహుల్ సాంకృత్యాయన్, ధర్మానంద కోసంబి, భదంత ఆనంద కౌశల్యాన్ లాంటి మార్క్సిస్టులు దర్శించారు. ఆ "దర్శనం" ఈ "బుద్ధోపదేశం" పద్యకావ్యంలో కూడా దర్శించగలం. బుద్ధుణ్ణి మనమంతా "సర్వజ్ఞుడు" అని అనుకుంటాం. కానీ, "సర్వజ్ఞత ఉండదు, నేను సర్వజ్ఞుణ్ణి కాదు" అని బుద్ధుడే చెప్పారు. అంటే...

నిరంతరం మారే ప్రకృతిలో, ప్రపంచంలో, సమాజంలో, వ్యక్తిలో మార్పు ఆగిపోదు. మార్పు ఆగిపోతేనే "సర్వజ్ఞత" ఉంటుంది. ఆగకపోతే సర్వజ్ఞత ఉండదు.

మనకు ఆధునిక కాలంలో మార్క్సిజం ప్రపంచానికి అందించిన ఈ తార్కిక సత్యాన్ని 2500 నాడే బుద్ధుడు ఆవిష్కరించాడు. "ప్రజలకు ముందు ఆకలి తీరాలి. ఆ తర్వాతే తత్త్వం" అన్నాడు బుద్ధుడు. అలాగే ... తన ప్రబోధాల్ని ప్రజల భాషలోనే అందించాలనే నియమం పెట్టాడు.

పండితుల భాష అయిన సంస్కృతంలోకి మార్చవద్దు అని కూడా చెప్పాడు. ప్రజల్ని మూఢ విశ్వాసాలతో ముంచి దాని ద్వారా ధనార్జన చేయడం మహా దోషంగా బుద్ధుడు పరిగణించాడు.

బౌద్ధంలోని ఇలాంటి అభ్యుదయ కోణాలన్నింటినీ తన వంద పద్యాల్లో అద్భుతంగా అచ్చ తెనుగులో తేట పరచారు నరసింహారావుగారు. 1956లో వచ్చిన ఈ పుస్తకాన్ని వారి అబ్బాయి కోగంటి లెనిన్ గారు మరలా ఇప్పుడు నరసింహారావుగారి శత జయంతి సందర్భంగా తెలుగు లోకం ముందుకు తెస్తున్నారు. తెలుగు నాట ఇప్పుడు బౌద్ధం వేగంగా పునరుత్థానం చెందుతోంది. ఇలాంటి సమయంలో ఈ పుస్తకం రావడం తెలుగు బౌద్ధలోకానికి ఎంతో ఉపకారం.

నా ఈ చిన్నమాటలను బౌద్ధత్రిరత్నాల్ని కమనీయ కందపద్యంగా అందించిన వారి పద్యంతోనే ముగిస్తాను.

**"బుద్ధుని శరణము నందుము.**
**బుద్ధుని సంఘంబు శరణు పొందుము, నీవా**
**బుద్ధుని ధర్మము నిల సం**
**బుద్ధుడవై దిశలు వెలయజేయుము బుద్ధా!"**

బుద్ధవందనాలతో...

**బొర్రా గోవర్ధన్**

బౌద్ధ రచయిత

# అభినందన

శ్రీ **కోగంటి నరసింహా రావు** గారి శతజయంతి సందర్భంగా వారు రచించిన "బుద్ధోపదేశము" పుస్తకాన్ని వారి కుమార్తె డా. కోగంటి ఉషారాణి గారు ప్రచురించడం అత్యంత ముదావహమైన విషయం. ఈ రచనను శ్రీ నరసింహా రావు గారు తేలికగా అందరికీ అర్థమయ్యే పద్యాల రూపంలో చేశారు. కాబట్టి, చిన్న పిల్లలు కూడా ఆసక్తి వుంటే హాయిగా చదువుకోవచ్చు.

బుద్ధ భగవానుడు మన దేశంలో ప్రభవించిన మహోన్నతమైన ఆధ్యాత్మికవేత్తల్లో ఒకరు. ఆయన స్థాపించిన బౌద్ధమతం ఒకప్పుడు భారతదేశమంతా వ్యాప్తి చెందింది. అంతేకాక, రాజుల ప్రోత్సాహంతో మన దేశానికి చేరువలో వున్న శ్రీలంకతో పాటు, ఆగ్నేయాసియా దేశాలు, సుదూర ప్రాంతాలైన చైనా, జపాన్ దేశాలకు కూడా విస్తరించింది. ఆ విధంగా బుద్ధ భగవానుని మూలంగా మన దేశఖ్యాతి ప్రాచీన కాలంలోనే దేశదేశాంతరాలకు వ్యాపించింది. ఆయా దేశాల నుంచి ఎందరో విద్యార్థులు మన దేశంలోని ప్రపంచ ప్రసిద్ధి చెందిన నలంద, తక్షశిల వంటి విశ్వవిద్యాలయాలకు వచ్చి విద్యనభ్యసించారు.

అలా ప్రసిద్ధి చెందిన విశ్వవిద్యాలయాలలో ఈనాడు నాగార్జునసాగర్ వున్న ప్రాంతంలో శ్రీపర్వతం వద్ద ఆచార్య నాగార్జునుడు స్థాపించిన విశ్వవిద్యాలయం కూడా ఒకటి. ఆ విధంగా చైనా నుంచి వచ్చిన ఫాహియాన్, హుయెన్ త్సాంగ్ వంటి విద్యార్థుల వల్ల వైభవోపేతమైన ఆనాటి మన దేశ చరిత్ర తెలుస్తున్నది.

మన దేశంలో తదనంతర పరిణామక్రమంలో బౌద్ధమతం దాదాపుగా కనుమరుగైనా, పైన పేర్కొన్న దేశాల్లో ఇప్పటికీ బౌద్ధమే ప్రధాన మతం. "వసుదైవ కుటుంబకం" బౌద్ధ మతానికి ఆయువుపట్టు."సర్వమానవ సౌభ్రాతృత్వం"తోపాటు, సర్వజీవహితం, భూతదయ, బుద్ధుని బోధనలోని ముఖ్య సూత్రాలు.

మన దేశంలో సామాజిక సంస్కరణలకు బుద్ధుడే ఆదిపురుషుడు. "సంఘం శరణం గచ్ఛామి", "ధర్మం శరణం గచ్ఛామి" అన్న సూక్తులను ప్రచారం చేసి, మానవాభ్యుదయానికి సంఘ జీవనమే మూలమని, మానవ జీవనం ధర్మ మార్గంలోనే నడవాలని ప్రబోధం చేసిన మహనీయుడు గౌతమ బుద్ధుడు. మానవుడు జీవనగమ్యంలో అసత్తు నుంచి సత్తునకు, తమస్సు నుంచి

జ్యోతిస్సునకు పయనించి, తద్వారా మృత్యువు నుంచి అమృతత్వాన్ని పొందడమే జీవన పరమావధి అని తెలియజేసిన తత్వజ్ఞుడు సిద్దార్థుడు. సంఘాన్ని ప్రేమించడం ద్వారానూ, ధర్మ మార్గాన్ని అవలంబించడం ద్వారానూ మానవ జీవితానికి సార్థకత చేకూరుతుందని బోధించాడు ఆయన. ఈ బోధనలు సర్వజనీనమైనవి మరియు సర్వకాలికమైనవి.

ఆధునిక వైజ్ఞానిక, సాంకేతిక పరిజ్ఞానంతో అమరిన ఆయుధ సంపత్తి మూలంగా యుద్ధోన్మాదంతో పెచ్చరిల్లిపోతున్న నేటి కాలంలో ప్రపంచ మనుగడకు బుద్ధుని భోధానలే తరుణోపాయమనేసేది నిస్సందేహం.

శ్రీ నరసింహారావు గారు తేలికైన తెలుగు పదాలలో బుద్ధదేవుని సూక్తులను పద్యాల రూపంలో మనకందించారు. ఇవి చదివిన వారికి బుద్ధుని ఆదర్శాలు కరతలామలకం అవుతాయనడంలో ఎలాంటి సందేహం లేదు.

డా. ఉషారాణి గారు తమ తండ్రి గారి శతజయంతి సందర్భంగా ఆయన రచించిన "బుద్ధోపదేశము" పుస్తకాన్ని మనకు అందించినందుకు ఆమెను మనసారా అభినందిస్తున్నాను.

**డా ॥ మండలి బుద్ధప్రసాద్**

మాజీ ఉపసభాపతి, మాజీ మంత్రి

ఆంధ్రప్రదేశ్

తేది: 19-12-2022

# అక్షయ(ర) స్మృత్యంజలి

– అవధానం టి.హెచ్. నటరాజారావు.

పేరులోనే శాంతిని ప్రోది చేస్తున్న శ్రీమతి శాంతిశ్రీ గారు తమ తండ్రి గారు రచించిన "బుద్ధోపదేశం" శతకం పునర్ ముద్రణలో ప్రజాబాహుళ్యంలో అందరికీ ముఖ్యంగా నేటితరానికి పద్య భావం సులభంగా అర్థమయే రీతి నందించాలని సంకల్పించడంలోని ఔచిత్యాన్ని గుర్తెరిగి ఈ శతకంలోని పద్యాలకు తాత్పర్యం వ్రాయడానికి అడిగిన తక్షణం అంగీకరించడం జరిగింది. దాదాపు 65 సం॥ క్రితం వ్రాయబడిన ఈ పద్యాలను కొంగ్రొత్త పుస్తకరూపంలో పదిల పరచుకోవాలన్న వారి ఆర్తి హృదయచాలకం. దివంగతుడైన తండ్రికి కుమార్తెలు, కుమారులు సమర్పిస్తున్న హృదయంగమ స్మృత్యంజలి ఇది. అక్షరాల హారతెత్తి ప్రేమ పురస్సరంగా పితౄణం తీర్చుకుంటున్న సిసలైన నివాళి. గుండెల్లో గూడుకట్టుకున్న అద్వితీయ ఆత్మయానుబంధాన్ని ప్రసరిస్తున్న రసనిర్భర హృద్దీపమిది.

సకలమతాల సారాంశాన్ని "సామరస్యపూర్వక" సమన్వయం తో సంస్కరణాత్మక దృక్పథంతో నాడు తనను కలచి కదిలించిన దృష్టాంతాలను ఇందులోని పద్యాలలో కీ॥శే॥ **కోగంటి నరసింహా రావు** గారు, తెలుగు పండిట్, విద్వాన్ అక్షర రమ్యతను వెలార్చుతూ "బుద్ధోపదేశం" శతకాన్ని ఆవిష్కరించారు. తెలుగు తోటలో వికసించిన సందేశాత్మక హృద్యపద్య పుష్పగుచ్ఛం ఈ చిన్ని పొత్తం.

అనిత్యమూ శోకమయమూ అయిన మానవ జీవితాన్ని చూసి రాజ్య సుఖాలను దోసి అడవిదారుల వెంట నడయాడి కఠిన ఉపవాసదీక్ష బూనిన త్యాగధనుడు బుద్ధుడు.

**ప్రోలుసుధాంశు శాలలిరు పొద్దులవిందులు హంసతూలికా లాలిత తల్పభోగ పరిరంభ సుఖాలు వధూట రమ్యనాట్యాలు సరోవరాలు ఎడనాడి చరించె క్షుధాగ్ని కీలలన్ కాలుచు కోసలేశుడు ప్రకామ గవేషణలో ప్రశాంతికై**

అటువంటి త్యాగమూర్తి ఎముకలగూడుగా మిగిలి కఠినదీక్షబూని వస్తుగతానుబంధయుత వాసనలను త్యజించినవాడు. పస్తుల కుక్షితో మసలి విశ్వహిత విశాల సామ్యవాదానికి తెరలేపిన

వాడు. కుల వర్ణ దూర సమతా పథమెంచుకొన్నవాడు. ఆ శాంతి కాముకుని ఉపదేశంతో ఒక పద్యరచన వెలువడడం నేటి రుజాగ్రస్త ప్రపంచవ్యవస్థలో అత్యంత హర్షణీయం. బుద్ధుడు చాటిన శాంతి అహింసలు సర్వజనీన సర్వకాలీన జీవన సూత్రాలు.

బుద్ధుడు హిందూ మతంలోని మూఢ ఛాందస ఆచారాలతో విభేదించినాడే కాని హిందూ మతాన్ని ద్వేషించలేదు.

**అవనిని కోర్కెల లంపట**
**అవలంబము దుఃఖ రాశి కని పలుకుచు హైం**
**దవభావ పల్లవమ్ముల**
**స్తవనీయ పరిమళంపు శాఖను చేర్చెన్.**

అని మనసా విశ్వసించడం సర్వదా కల్యాణకారకం. కవి నరసింహారావు కూడా తన మున్నుడిలో సాలీపులాకంగా సర్వధర్మ సమన్వయ దృక్పథాన్నే సూచించినారు. "తమసోమా జ్యోతిర్గమయ" అని ఎలుగెత్తిన బుద్ధునిపై హృద్యపద్య సౌగంధ్యాన్ని అందించిన కవి నరసింహ రావు బహుధా శ్లాఘనీయుడు. వారి ఆలోచనా లోచనాలను తాత్పర్య సహితంగా సర్వాంగ సుందరంగా పుస్తక రూపంలో పరిరక్షించాలని సంకల్పించిన వారి కుటుంబ సభ్యులు ధన్యజీవులు.
స్వస్తి!

4-12-2022
సహృదయవిధేయుడు,
అవధానం **టి. హెచ్. నటరాజారావు.**
భాగ్యనగరం.

# పరిచయం

రెండు వేల ఐదువందల సంవత్సరాలనాటి బుద్ధ నిర్వాణోత్సవాలు నేడు దేశ దేశాల్లో – విరివిగా మన దేశంలో చేస్తున్నారు. ఆ ఉత్సవాలు కలిగించిన వుద్వేగంవల్లనే యీ చిన్న కబ్బం ఆవిర్భవించింది.

కవికి ప్రధమ ప్రయత్నమే అయినా, రచనలో కవి సూత్రాకృతి దాల్చగల నిర్మాణగరిమను ప్రదర్శించాడు; తేటగీతి, ఆటవెలది, కందం – యీ మూడు ఛందాల్లో కృతిని మూడు భాగాలుగా నడిపాడు. కందంలో కుదిరిన తూగు పెంపరికానికి యోగ్యంగా వుంది. రచనలో కవి సరళత్వాన్ని సన్నజాలుగా సమపాళ్ల తెలుగుదనంతో సరిదిద్దాడు; వర్ధమాన కవితావరవడి ప్రదర్శింపబడింది.

బుద్ధుడు మన చరిత్రలో అత్యున్నత శ్రేణికి చెందిన వ్యక్తి. జననం కపిలవస్తు రాజరికంలో; ఆలోచనాసరళి రాచరికాలకతీతంగా మానవాభ్యుదయ వికాసహేతుపథంలో. బుద్ధుడు ప్రాయికంగా హేతువాది. నాటి మతాల నాయకత్వం గౌతమ శుద్ధోదనునకు నచ్చలేదు. మనస్సు మరోమార్గాన్ని ఆకాంక్షించింది. ఆలోచన, సంస్కారం – అండరాగా, ఆ మరోమార్గాన్ని వెదకి, ప్రకటితం చేశాడు; అదే బుద్ధమార్గం.

మతాలు మానవవికాసానికి ఆరంభములో కొంత వుపకరించినా, రోజులు గడవగా, ప్రతిబంధకాలుగా తయారైనై; దానివల్ల మానవుని వ్యక్తిత్వం శూన్యత్వంలో కలసిపోయింది. బుద్ధుడు ఆ మానవుని వ్యక్తిత్వాన్ని తిరిగి పునరుద్ధరించాడు. మానవుడు చేయవలసింది దేవునికి వూడిగమే కాదు, మంచి ప్రవర్తనతో నాన్యతోదర్శనీయ వికాసాన్ని పొందవచ్చునన్నాడు. మనమే మన పనులకు వుత్తరవాదుల మన్నాడు. కర్మను, వేదాలను, పారలౌలిక పాప పుణ్యాలను, కులాలను, మతాలను ఒక్కసారిగా దుల్లిబుచ్చాడు. లోకం విహ్వాలించి, గౌతముణ్ణి బుద్ధుడన్నది. ఆ బుద్ధుడు అహింసావాదానికి కాణాచి.

బుద్ధజయంతికి యీ కృతి వెలార్చటం ముదావహం. ఎవరి వుత్సాహాన్ని వారు వారికి నచ్చినరీతిలో, మాతృకకు అపచారం లేకుండా, ఆకృతీకరించటం ఆనందానికి, స్వేచ్ఛకు మార్గం. బుద్ధమార్గం స్వేచ్ఛామార్గం గనుక, యిట్టి ప్రయత్నాలు బుద్ధత్వచ్ఛాయలుగా పరిగ్రాహ్యాలు.

తెనాలి
23–5–56

ఆవుల గోపాలకృష్ణమూర్తి,
M.A., LLB.

# మనలో మాట

విశ్వము సువిశాలము అనన్తము. నిరంతర పరిణామశీలమైనది ప్రకృతి. ప్రపంచమునకు సృష్టిస్థితి లయములు సహజములు. ప్రచండవేగముతో కాలచక్రము పరిశుభ్రమిస్తున్నది. జననమరణాలు, కష్టసుఖాలు, రాగద్వేషాలు, జ్ఞానాజ్ఞానములు జీవకోటికి వెలుగునీడలవలె వెన్నంటి వచ్చుచునే యుండును. మానవుడు మరణాధీనుడే కావచ్చు. కాని మానత్వము అమరమైనది. క్షణికము బుద్బుదప్రాయమైన మానవజీవితమొక మహాజీవనది వంటిది. విశ్వరహస్యాన్వేషణమే విజ్ఞానమునకు ఫలము. విశ్వాన్ని ప్రతిఫలింప చేయునది సాహిత్యము. వైజ్ఞానిక పరిశోధనఫలమే ప్రపంచకళ్యాణానికి మూలము. ప్రజాస్వామ్యయుగంలో విశ్వశ్రేయస్సాధనలో ప్రజలందరు భాగస్వాములే.

విశ్వమతస్థాపకులలో బుద్ధుడు ప్రసిద్ధుడు. సంపూర్ణ మానవత్వము సాధించిన మహాపురుషులలో గౌతముడగ్రగణ్యుడు. తృష్ణావ్యామోహాది దుర్వ్యసనములచే పంకిల మైయున్న సాంసారిక దుఃఖాంబుధి తరుణోపాయములుగా చతురార్యసత్యములను ప్రబోధించిన మహాయోగి బుద్ధుడు. నాటి సమాజములోనున్న జటిల వైదిక కర్మకాండను, ఛాందసాచారములను రూపుమాపి ప్రజాసామాన్యమున నైతిక ధర్మాచరణ ద్వారా సమాజమునకు నవజాగృతి కల్పించియున్నాడు.

సామాజిక సంస్కరణలకు మతవిప్లవాలకు బుద్ధుడు అందెవేసిన చేయి. జనసామాన్యమునకు సుబోధకమగు భాషలో ఆచరణీయములైన సిద్ధాన్తముల బోధించిన సామ్యవాది. అశాంతితో సంక్షుభితమైన లోకములో కరుణామృతాన్ని చల్లి అహింస, ప్రేమ, సత్యాల ద్వారా శాంతిసందేశమందించిన తత్వవేత్త సిద్ధార్థుడు.

అటువంటి మహాపురుషుల ఆదర్శసిద్ధాన్తములను, విభిన్న మతాలలోని విశిష్టతను, బహుళ గ్రంథాల సారాంశాన్ని సామరస్యపూర్వకముగా సమన్వయించుకొని, సంస్కరణదృష్టితో, సహేతుకమైన స్వానుభవముతో పరస్పరము కార్యశూరులమై కృషిచేసిననే వసుధైక ప్రభుత్వ స్థాపనము సుగమము కాగలదు. మహాసాంఘిక విప్లవసంస్కర్తయైన తథాగతుని ఉపదేశముల నాధారముగా గొని జాతీయ ఛందస్సులతో నా నేర్పుకొలంది సంస్కరణాశయముల ఈ శతకమున కూర్చితిని. సంస్కరణకు సుపరిచితులైన శ్రీ ఆవుల గోపాలకృష్ణమూర్తి, M.A., LL. B గారు "బుద్ధోపదేశము" సావధానముగా చదివి ఆదరాభిమానములతో పరిచయ వాక్యములిచ్చినందులకు వారికి నా హృదయపూర్వక అభివందనములు.

నా యీ ఉపదేశ కృతికి మధురోపస్కృతి నొనరించిన ప్రియ మిత్రులు శ్రీ కవి రాజు కొండవీటి వేంకటకవి గారికి ధన్యవాదములు. కొలదికాలములో ఈ శతకాన్ని సర్వాంగ సుందరముగా ముద్రించి సకాలములో అందించిన మిత్రులు కవిరాజ పబ్లిషర్సు వారికి కృతజ్ఞత.

–రచయిత

# బుద్ధోపదేశము

**ఎల్లభూతములను నేక రీతిగఁ జూచి**
**యాదరించువాఁడె యనఘచరితుఁ**
**డతఁడె జగము మేలు నాసించునని తెల్పు**
**బుద్ధసూక్తి వినుఁడి పుణ్యులార! (1)**

తాత్పర్యము: పుణ్యాత్ములంటే ప్రాణులన్నింటిని సమానంగా ప్రేమించ గలిగేవారు. వారే సమదృష్టితో లోకమంతటికి మేలు జరగాలని సంకల్పించగలరనీ తెలిపుతుంది బుద్ధ సూక్తి!

**పరుల సౌఖ్యమునకుఁ బరితాపమందెడి**
**జనుఁడు జనుఁడుఁగాఁడు జడుఁడుగాని**
**జగతి సుఖమె తనదు సౌఖ్యమ్మని తలంచు**
**బుద్ధసూక్తి వినుడి పుణ్యులార! (2)**

తా: ఇతరుల సుఖములను చూసి ఓర్వలేక దుఃఖం పొందువాడు, స్పందనలేని దేహంగల జఢునితో సమానము. సమస్త జగతి పొందే సుఖమే తన సుఖమని బుద్ధ సూక్తి.

**క్షమవహించి ప్రేమ సత్యాల నెపుడు వీ**
**క్షించుచుండువాఁడె శ్రేష్ఠుఁ డరయ**
**కాంతిలేని జనుఁడు జగతి వ్యర్థుం డను**
**బుద్ధసూక్తి వినుఁడి పుణ్యులార! (3)**

తా: ఓర్పు కలిగియుండి లోకంలో ప్రేమను సత్యాన్ని దర్శించ గలగడమే శ్రేష్ఠుని లక్షణము. శాంతిలేనివారు నిష్ప్రయోజకులని వారు లోకానికేమి మేలుచేయలేరు.

**బాధనొందు వారి వేదనఁ గనుగొని**
**తాపమంది రూపు మాపువాఁడు**
**సజ్జనుండు; వాని జన్మమ్ము ధన్యమ్ము**
**బుద్ధసూక్తి వినుఁడి పుణ్యులార! (4)**

తా: ఇతరుల బాధను చూసి హృదయం పరితపించి, వారి బాధను పోగొట్టగలవాడే సజ్జనుడు. అలాంటివారి జన్మ ధన్యమని బుద్ధ సూక్తి.

---

**ఏదీ శాశ్వతం కాదు నిన్ను నువ్వు ఒత్తిడికి గురి చేసుకోకు ఎంతటి గడ్డు పరిస్థితైనా సరే మారిపోక తప్పదు.**

**ఎప్పుడైనగాని యెక్కువ తక్కువల్**
**చూపరాదు జనులఁ బాప మద్ది**
**అట్టివాఁడు తుదకు గట్టిబాధలనందు**
**బుద్ధసూక్తి వినుఁడి పుణ్యులార! (5)**

తా: మనుషుల మధ్య బేధభావాలని సృష్టిస్తూ ఎక్కువగా తక్కువగా చూడడం బుద్ధిలేనివారు చేసే పాపము. అట్టి వ్యక్తులు చివరికి తామే దుఃఖంలో మునిగి అశాంతి పాలవుతారు.

**చక్రవర్తియైన సామాన్యుఁడైన మ**
**ఱెట్టి జనుఁడు గట్టి దిట్ట యైన**
**జనన మరణములను నెనయు నిత్యమ్మను**
**బుద్ధసూక్తి వినుఁడి పుణ్యులార! (6)**

తా: సామాన్యుడైనా, చక్రవర్తియైనా, ఎంతటి గొప్పవాడైనా సరే ఈ లోకంలో జనన మరణాలను పొందుట తధ్యము. వాటి నడుమ మనము కొట్టుమిట్టాడ వలసిందేనని బుద్ధ సూక్తి.

**గంగయందు లేచు భంగంబు లెప్పుడు**
**సమసిపోవు నరయ క్షణమునందె**
**స్థిరముగాదు ధరణి జీవితంబనునట్టి**
**బుద్ధసూక్తి వినుఁడి పుణ్యులార! (7)**

తా: నీటిలో ఏర్పడిన బుడగ మరుక్షణంలోనే పగిలిపోతుంది. క్షణంలోనే నశించే బుడగల్లాగా ఈ ధరిత్రిలో జీవితం శాశ్వతం కాదని ఎరుకలో ఉండాలి.

**నీటిబుడగవోలె పాటిల్లి జననమ్ము**
**మాయమగును నిముసమాత్రముననె**
**దీని కింత మమతఁ బూనుట తగదను**
**బుద్ధసూక్తి వినుఁడి పుణ్యులార! (8)**

తా: క్షణకాలంలో మటు మాయమయ్యే నీటిబుడగ వంటి జీవితం పై మమతను పెంచుకొనుట తగదన్న బుద్ధ సూక్తి.

**ఏలినారు ధరణి నెందఱో రాజులు**
**నిలువఁ గలిగినారె! నిత్యముగను**
**అంతె మనదు బ్రతుకు; అని వచియించెడి**
**బుద్ధసూక్తి వినుఁడి పుణ్యులార! (9)**

తా: ఈ భూమిని ఎందరో రాజులు పాలించారు కాని ఏ ఒక్కరూ శాశ్వతంగా నిలచిపోలేదు. మనిషి బ్రతుకు కూడా అనిత్యమనేది జీవన సత్యం.

**సౌఖ్యమబ్బు నేఁడు సమసిపోవును రేపు**
**పట్టఁగలమె వాని నెట్టులైన**
**కష్టసుఖము లెపుడు కావడికుండలన్**
**బుద్ధసూక్తి వినుఁడి పుణ్యులార! (10)**

తా: నేడున్న సుఖము రేపటికి సమసిపోతుంది. కష్టసుఖాలు కావడికుండల్లాంటివి. ఏ సుఖ సంతోషాన్నైనా శాశ్వతంగా మనం పట్టి ఉంచలేమని బుద్ధ సూక్తి.

**రాజరాజుగాని రహిపేద యైనను**
**ధరణియందుఁ దాను ధర్మమెపుడు**
**పలుకుచుండువాఁడె బహుపుణ్యుఁ డని చెప్పు**
**బుద్ధసూక్తి వినుఁడి పుణ్యులార! (11)**

తా: రాజ్యాలేలే రాజు కావచ్చు. నిరుపేద కావచ్చు. ఎవడు ధర్మాన్ని పాటిస్తాడో అతడే ఈ లోకంలో పుణ్యాత్ముడన్నదే బుద్ధ సూక్తి.

**వృత్తివలన జనన మెత్తిన మతములు**
**మాటుచుండు వృత్తి మఱఁగి నపుడు**
**మతము వేఱెయైన మనసొక్కటను నట్టి**
**బుద్ధసూక్తి వినుఁడి పుణ్యులార! (12)**

తా: వృత్తి ఆధారంగా పుట్టిన మతం శాశ్వతంగా మనజాలదు, ఎందుకంటే లోకంలో వృత్తులు మారిపోతుంటాయి కనుక. అందుకే మనస్సునెపుడూ మతాలకతీతంగా ఉంచుకొమ్మని బుద్ధ సూక్తి.

---

**కాలాన్ని వృథా చేయడమంటే నిన్ను నువ్వు దోపిడీ చేసుకోవడమే.**

**మాల మాల యనుచుఁ దూలనాడినమాత్ర**
**మాల జనుఁడుగాఁడె మహినిఁజూడ**
**మాల లేక పనులు మనకెట్లు జరుగును?**
**బుద్ధసూక్తి వినుఁడి పుణ్యులార! (13)**

తా: ఒక వ్యక్తిని కులం పేరుతో "మాల" అని దూషించక, ఆ వ్యక్తి మాల జాతి మనుషుల మధ్య పరస్పర సహకారం సంఘీభావమే సమాజాన్ని నిలబెడుతుందని బుద్ధసూక్తి.

**ఇంట నొక్కమాట యిల్లుదాటఁగ నొండు**
**పలుకుచుండువాఁడు తులువ జగతి**
**మోసబుద్ధివీడి వాసించుఁడీ యను**
**బుద్ధసూక్తి వినుఁడి పుణ్యులార! (14)**

తా: కుత్సితుడు తన బూటకపు మాటలు మాట్లాడుతూ కపట ప్రవర్తనుడై ఉంటాడు. మోసపూరితమైన బుద్ధి విడనాడమని హితవు బుద్ధసూక్తి.

**వీలువాలుమాలి మాలని వచియించి**
**గుణము జూడఁబోరు జనులు ధరణి**
**కులముకంటె గుణము గొప్పకు గొప్పను**
**బుద్ధసూక్తి వినుఁడి పుణ్యులార! (15)**

తా: మనిషిలోని గుణాన్ని గుర్తించక, కులం పేరుతో అవమానకరంగా దూషణ కుసంస్కారులకు పరిపాటి. కులం కంటే గుణం గొప్పదన్న సూక్తి మనకు శిరోధార్యం.

**గంగమునిఁగియున్న కాశిని గనుఁగొన్న**
**వ్రతముఁ జేసియున్న భక్తియున్న**
**చిత్తశుద్ధిలేని చేఁతలు రోఁతలన్**
**బుద్ధసూక్తి వినుఁడి పుణ్యులార! (16)**

తా: గంగలో మునిగేవారు, కాశీని దర్శించు వారు వ్రతాలు చేసేవారు భక్తి ప్రదర్శిస్తారు. కాని వారు చేసే చేతల్లో చిత్తశుద్ధి లేక రోత పుట్టిస్తాయి. మనసులోని మాలిన్యం తొలగించుకొమ్మని బుద్ధసూక్తి.

**అమ్మ యక్క యనుచు నల్లన బూతులు**
**దూయఁబట్టువాడు దుష్టుఁ డరయ**
**వాక్కు శుద్ధి లేనివాఁడు వ్యర్థుం డను**
**బుద్ధసూక్తి వినుఁడి పుణ్యులార! (17)**

తా: ఎదుటివారిని ద్వేషిస్తూ వారి తల్లినీ, తోబుట్టువులనూ అసభ్య పదజాలంతో దూషించడం దుష్ట లక్షణం. వాక్శుద్ధి లేనివాడు వ్యర్థుడని బుద్ధుని ఉపదేశం.

**దొంగజపముఁ జేసి దోచుక డబ్బును**
**గూడఁబెట్టువాడు కూళుఁ డరయ**
**కొంగజపముఁ జేయ లొంగదు పర మను**
**బుద్ధసూక్తి వినుఁడి పుణ్యులార! (18)**

తా: దోచుకోవాలన్న దుర్బుద్ధితో దొంగ జపం చేస్తూ సొమ్ము కూడబెట్టేవాడు మోసగాడు. అనగా కుత్సితుడు. దొంగ జపానికి పరమాత్మ లొంగడన్నది బుద్ధ సూక్తి.

**చెప్పవలయు గురుఁడు శిష్యులం దరిఁజేర్చి**
**తనకుం దెలిసినదియు దాఁచకుండ**
**అట్టి బోధలేని యతఁడు వ్యర్థుండను**
**బుద్ధసూక్తి వినుఁడి పుణ్యులార! (19)**

తా: తానెరిగిన మంచిని శిష్యులకు ఉపదేశించి సజ్జనులుగా చేయడం ఉత్తమ గురువు కర్తవ్యం. సత్యాన్ని బోధించని గురువు సమాజానికి భారం, వ్యర్థుడన్న బుద్ధసూక్తి.

**మాట తీపిగలిగి మనసు తీపియు లేక**
**విషము గలిగి తిరుగు వేషగాఁడు**
**కుక్కకంటె హీనగుణుఁడంచుఁ దెల్పెడి**
**బుద్ధసూక్తి వినుంది పుణ్యులార! (20)**

తా: మనసులో విషం నింపుకొని, తియ్యని మాటలు చెప్పుతూ తిరిగేవాడు కుక్కకంటే హీనమైనవాడని బుద్ధ సూక్తి వక్కాణిస్తోంది.

**పరుల మోసపుచ్చి పరుల కొంపలం గూల్చి**
**బ్రతుక నేర్చువాఁడు పాపి యగును;**
**దుష్టవర్తనంబు కష్ట కారణ మను**
**బుద్ధసూక్తి వినుఁడి పుణ్యులార! (21)**

తా: ఇతరులను మోసపుచ్చి వారికి నష్టం కలిగించేవాడు పాపాత్ముడని, అట్టి దుష్ట ప్రవర్తన లోకానికి నష్ట కారకమన్న బుద్ధుని సూక్తి లోకహితం.

**దుర్గుణంబులన్ని దూరంబుగాఁ ద్రోచి**
**సజ్జనాత్ముఁ డగుట చాల మేలు;**
**సజ్జనత్వమున్న స్వర్గం బదేలన్న**
**బుద్ధసూక్తి వినుఁడి పుణ్యులార! (22)**

తా: నీవు కాంక్షించే స్వర్గం కన్నా నీలోని మంచితనమే మిన్న. ఆలోచనల్లోని చెడును విడనాడాలన్నదే బుద్ధుని ఉపదేశం.

**అచటిమాట లిచట నిచటిమాట లచట**
**తెలుపుచుఁడువాఁడు ములుచ తలఁప**
**నియతిలేని బ్రతుకు నిష్ఫలంబని తెల్పు**
**బుద్ధసూక్తి వినుఁడి పుణ్యులార! (23)**

తా: మూర్ఖుడు ఒకరి విషయాలు ఇంకొకరికి చేరవేస్తూ, చాడీలు చెప్పుతూ ఎలాంటి నిబద్ధత లేకుండా బతుకుతూ సంఘానికి చేటు తెస్తాడు.

**కలుగుదానితోడ మెలఁగుచుండెడివాఁడు**
**ఘనుఁడు; తృప్తిలేక మిణుకువాఁడు**
**తనను దాను జంపుకొనునట్టివాఁ డను**
**బుద్ధసూక్తి వినుఁడి పుణ్యులార! (24)**

తా: తనకున్నదానితో తృప్తిపడే వాడే గొప్పవాడు. తృప్తిలేని జీవనం ఆత్మహత్యా సదృశం. అంటే తృప్తిచెందని వాడు తనను తాను చంపుకొన్నట్లే.

**నోరులేని పశువులంబట్టి బంధించి**
**ప్రాణమూడ్చువాఁడు పాపియగును**
**జీవహింస నెపుడు చేయరా దనునట్టి**
**బుద్ధసూక్తి వినుఁడి పుణ్యులార! (25)**

తా: నోరు లేని పశువులను చంపుట పాపమని, అందుకే జీవహింస విడనాడమని బుద్ధుడు హితవుపలికాడు.

**పుట్టఁబెట్టు నెపుడు గట్టిగా చీమలు**
**చెదిరిపోవు గడువుఁ జేరెనేని**
**చీమపుట్టపగిది జీవితంబనుచుండు**
**బుద్ధసూక్తి వినుఁడి పుణ్యులార! (26)**

తా: చీమలు పెట్టిన పుట్టలు శాశ్వతం కావు చెదరిపోక తప్పదు. అలానే మట్టిబొమ్మలాంటి మనిషి జీవితం అశాశ్వతం అంటాడు బుద్ధుడు.

**మూఢభక్తి నెడద గాఢమ్ముగానమ్మి**
**పరముకొఱకు జంతుబలుల నీయ**
**హింసవంశముల దహించుఁ దప్పకయను**
**బుద్ధసూక్తి వినుఁడి పుణ్యులార! (27)**

తా: పరమాత్మను తృప్తిపరచాలని మూఢభక్తితో జంతు బలులివ్వడం హేయమైన చర్య అని, హింస వంశ, లోక వినాశకరమని బుద్ధుడు మనకందించిన సందేశం.

☸☸☸

**విశ్వమందు మిగుల విఖ్యాతిగాంచిన**
**దాంధ్రశిల్ప మరయ ననవరతము**
**శాతవాహనులను స్వాంతాన దలఁచుచు**
**మెలఁగుచుండు మెపుడు తెలుఁగు బిడ్డ! (28)**

తా: ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన శిల్పకళను చాటిన మన ఆంధ్ర శాతవాహనులను తలచుకుంటూ తెలుగుజాతికి హారతులివ్వ వోయీ తెలుగుబిడ్డా!

**మోహపాశములకు ముగ్ధుఁడై మర్త్యుండు**
**మునిఁగితేలు దుఃఖమున సతమ్ము**
**జాలమందుఁ దగులు శశకంబు చందాన**
**తెలిసి మెలఁగుమోయి తెలుఁగు బిడ్డ! (29)**

తా: వలలో చిక్కుబడి విలపించే కుందేటి చందాన, మోహపాశములకు తగులుకొని మనిషి దుఃఖములో మునిగి తేలుతుంటాడన్న ఎఱుక కలిగి వుండవోయీ తెలుగుబిడ్డా!

**దారితెన్ను లేక ధరణిని మర్త్యుండు**
**తృష్ణయనెడి నదిని తేలుచుండు**
**నా ప్రవాహమందు హరిణమ్ము రీతిగా**
**తెలిసి మెలఁగుమోయి తెలుఁగు బిడ్డ! (30)**

తా: ప్రవాహమందు చిక్కుకుపోయిన జింకలాగా మనిషి ఎల్లప్పుడూ తృష్ణ అనే నదిలో మునిగి తేలుతూ దారి, తెన్ను గానక కొట్టు మిట్టాడుతుంటాడని తెలుసుకో!

**మత్సరంబునూఁది మనుజుండు నిచ్చలు**
**కష్టపడుచు భువిని భ్రష్టుఁడగును**
**పొలము గడ్డిగాదములు గల్గి చెడునట్లు**
**తెలిసి మెలఁగుమోయి తెలుఁగు బిడ్డ! (31)**

తా: మత్సరమనే చెడుగుణం కలుపుమొక్కలా పెరిగి మనిషి జీవనక్షేత్రాన్ని భ్రష్టు పట్టిస్తుంటుందని గ్రహించవోయీ తెలుగోడా!

**జన్మ కర్మఫలము సాజమ్ములంచును**
**నమ్మమనుచుఁ బలికి రిమ్ముగాను**
**ధరణి సురుల మిగుల ధర్మపన్నంబులు;**
**తెలిసి మెలఁగుమోయి తెలుఁగు బిడ్డ! (32)**

తా: జన్మ కర్మఫలము యొక్క సహజ పర్యవసానమని వేదపండితులు ధర్మపన్నాలు వచించిన సంగతిని ధ్యాసలో వుంచి జాగరూకతో మెలగవోయి!

---

**వినుతి కెక్కినట్టి విద్యాలయమ్ములు**
**ఖ్యాతిగన్న యల విహారములును**
**చెలగుచుండు మున్ను శ్రీపర్వతంబున**
**తెలిసి మెలఁగుమోయి తెలుఁగు బిడ్డ! (33)**

తా: పూర్వం శ్రీపర్వతము విద్యాలయాలకు విహారయాత్రలకు ప్రసిద్ధిగాంచెనని తెలుసుకోరా సోదరా!

**గుడులు గోపురములు మడులు మాన్యము లిచ్చి**
**జాతి పూజఁజేయు కోఁతిమూఁక**
**బడుగు మొఱలు చెవిని బడ నాదరించునా?**
**తెలిసి మెలఁగుమోయి తెలుఁగు బిడ్డ! (34)**

తా: గుడులు, గోపురాల పేరున మడులు మాన్యాలనిచ్చి రాతి బొమ్మలకు మొక్కుతూ వుండే విగ్రహారాధకులు బడుగు మనిషి కష్టాలను పట్టించుకుంటారా?

**రాజ్యరమను వీడి రమణిని త్యజియించి**
**కఠిన తపముఁ జేసి జ్ఞానియైన**
**యమృతమూర్తి బుద్ధు నమరగాథను నీవు**
**తెలిసి మెలఁగుమోయి తెలుఁగు బిడ్డ! (35)**

తా: రాజ్య సుఖాలను త్యాగం చేసి ధర్మపత్నిని త్యజించి కఠినదీక్షబూని తపోధనుడై లోకానికి జ్ఞానమనే అమృతాన్ని అందించిన గౌతమ బుద్ధుని చరిత్రను తెలుసుకో.

**ప్రకృతిలోనఁ గల్గు పరమధర్మమ్మును**
**బోధఁ జేసె మనకు బుద్ధుఁ డిపుడు**
**గురువు శాక్యసింహుఁ డరయంగ మన కెల్ల**
**తెలిసి మెలఁగుమోయి తెలుఁగు బిడ్డ! (36)**

తా: ప్రకృతిలో మనిషికి ఏది పరమధర్మమో విశదీకరించిన పరమ గురువైన బుద్ధుని బోధ తెలుసుకో తమ్ముడూ!

**భక్తిగలిగెనేని శక్తి ప్రాప్తించును**
**భక్తిగలిగెనేని ముక్తివచ్చు**
**భక్తి శక్తి గలుగు వ్యక్తి పుణ్యుండగు**
**తెలిసి మెలఁగుమోయి తెలుఁగు బిడ్డ! (37)**

తా: భక్తి ఉన్నచోట శక్తి ఉంటుంది. భక్తి ముక్తికి మార్గం చూపుతుంది. భక్తి, శక్తి గలిగిన వ్యక్తి పుణ్యజీవి అని తెలుసుకో సోదరా!

**కాన నున్న యట్టి కార్చిచ్చు విధమున**
**వననిధింగల బడబాగ్ని కరణి**
**విషయభోగ వహ్ని విలసిల్లు నిరతంబు**
**తెలిసి మెలఁగుమోయి తెలుఁగు బిడ్డ! (38)**

తా: అడవిలో కార్చిచ్చున్నట్లు, సముద్రంలో బడబాగ్ని దాగివున్నట్లు కోరికల లంపటంలో విషయలాలసనే అగ్ని దాగి వున్నదని తెలుసుకోరా!

**మతము మతమటంచు మానవు లనుచుందు**
**మతముకంటె వేఱె మత్తు గలదె?**
**మతములన్ని చూడ మానవ సృష్టియే**
**తెలిసి మెలఁగుమోయి తెలుఁగు బిడ్డ! (39)**

తా: మతమనే మత్తులో కొట్టుకుపోకుండా మతం కూడా మనిషి చేసిన సృష్టియేనని ఎరుక కలిగిఉండవోయీ సోదరా!

**బిరుదములకు మొగ్గి బీ.ఏ.లు యం.ఏ.లు**
**అందవచ్చు భాగ్య మందవచ్చు**
**ఆచరణము లేక యవి వ్యర్థమైపోవు**
**తెలిసి మెలఁగుమోయి తెలుఁగు బిడ్డ! (40)**

తా: కళాశాలల్లో విశ్వవిద్యాయాల్లో డిగ్రీలెన్ని పొందినా ఆచరణలో లేని జ్ఞానం వ్యర్థమని గ్రహించవోయీ తెలుగు బిడ్డా!

---

**కులము లేదటంచు కలిమి శూన్యమ్మంచు**
**పలువరించువాఁడు తులువ సూవె**
**కులముకంటె గొప్ప గుణమె ముఖ్యమ్మని**
**తెలిసి మెలఁగుమోయి తెలుఁగు బిడ్డ! (41)**

తా: కులం కులం అంటూ పలవరించేవాడు పరమ మూర్ఖుడు. కులంగా కంటే గుణం గొప్పదని తెలుసుకో సోదరా!

**గంజి లేక తావ కట్టగుడ్డయు లేక**
**నీదు దేశమందు బాధపడుచు**
**లక్షలాది జనులు భిక్షమెత్తుచునుండ్రి**
**తెలిసి మెలఁగుమోయి తెలుఁగు బిడ్డ! (42)**

తా: ఈ నేలపై లక్షలాది మంది అన్నవస్త్రాలు కూడా లేకుండా కనీసం గంజికైనా నోచుకోకుండా అలమటిస్తున్నారని ఎరుక కలిగి మెలగవలెనురా సోదరా!

**గ్రుడ్డి కుంటి కుష్ఠరోగమ్ములను వేఁగి**
**యండ లేక కుందుచుండు వారి**
**నాదరింప నైహికాముష్మికము లబ్బు**
**తెలిసి మెలఁగుమోయి తెలుఁగు బిడ్డ! (43)**

తా: కుంటివారు, గ్రుడ్డివారు, కుష్టురోగులే కాకుండా సమాజంలో ఎవరి అండదండలు లేకుండా కష్టాలనుభవించే వారి పట్ల మనం చూపే ప్రేమాదరణలోనే ఇహపర సాఫల్యం ఉందన్నది సత్యం సోదరా!

**ఒకని కొకని కెపుడు తికమక గల్పించి**
**జాతిజాతి కెపుడు భీతిగొల్పు**
**మహిని కలఁతపెట్టు మతములు మతములే?**
**తెలిసి మెలఁగుమోయి తెలుఁగు బిడ్డ! (44)**

తా: మనుషుల మధ్య జాతుల మధ్య అనైక్యతను సృష్టించే మతము ఒక మతమే కాదని తెలుసుకోరా సోదరా!

**మట్టిలోనఁ బుట్టి మట్టిలోఁ బెఱిగియు**
**మట్టిఁ గలియు నరుఁడు కట్టకడకు**
**దిట్టరైనగాని స్థిరముగా నుండునే!**
**తెలిసి మెలఁగుమోయి తెలుఁగు బిడ్డ! (45)**

తా: మట్టిలో పుట్టి మట్టిలో జీవనం సాగించి తుదకు మనిషి మట్టిలోనే కదా కలిసిపోయేది? ఎంత గొప్పవారికైనా అంతం తప్పదని జీవితం అనిత్యమని గ్రహించాలి.

**ప్రజలకర్థమైన భాషలో నీతిని**
**బోధఁజేసి ముక్తి పొంతఁ జేర్ప**
**ధర జనించినట్టి తత్త్వజ్ఞు బుద్ధుని**
**తెలిసి మెలఁగుమోయి తెలుఁగు బిడ్డ! (46)**

తా: ప్రజలకు సరళంగా అర్థమయ్యే భాషలో జ్ఞానబోధ చేయడానికి ఈ భూమి పై జన్మనెత్తిన తత్త్వజ్ఞుడని బుద్ధుణ్ణి గుర్తించరా సోదరా!

**అతని కాలమందు నవని నేలెడి బింబి**
**సారుఁదొట్టి రాజచక్రమెల్ల**
**మతము వ్యాప్తిఁజేయ సతతము కృషిసల్పె**
**తెలిసి మెలఁగుమోయి తెలుఁగు బిడ్డ! (47)**

తా: బుద్ధుని కాలంలో బింబిసారుడనే రాజు అహర్నిశలు బౌద్ధమతవ్యాప్తికై కృషి చేశాడని తెలుసుకోరా తమ్ముడూ!

**వినయపిటక సుత్తపిట కాభిధమ్మపి**
**టకములనుచు వేద నికరములను**
**పాళీభాషయందుఁ బరిఢవిల్లగఁ జేసె**
**తెలిసి మెలఁగుమోయి తెలుఁగు బిడ్డ! (48)**

తా: పాళీభాషలో "వినయపిటక", "సుత్త పిటక", "అబిదమ్మ పిటక"లనే వేదసారాన్ని వ్యాప్తి చేయడానికే బింబిసారుడు ఎల్లవేళలా ప్రయత్నించాడని తెలుసుకో సహోదరా! (పిటక=గంప)

**కలసిమెలసి భూతగణము లొక్కొట లీన**
**మగుచునుండు, కొన్ని యందు నొదవు**
**జలధిఁ బుట్టునట్టి యలల విధమ్మున**
**తెలిసి మెలఁగుమోయి తెలుఁగు బిడ్డ! (49)**

తా: కడలిలో పుట్టి కడలిలోనే లీనమయ్యే అలలవలె సృష్టిలో భూతగణములన్నీ ఒకదానిలో నొకటి లీనమవుతాయన్న ధ్యాసతో ప్రవర్తించవోయీ సోదరా!



**కలిమి బలము బంధువులఁ దల్లిదండ్రులఁ**
**గట్టికొన్న యాలి నట్ట విడిచి**
**కాననాంతరములఁ గాలూనితి విరక్తి**
**భూరి ముదముతోడ బుద్ధదేవ! (50)**

తా: ఇల్లాలిని, తల్లిదండ్రులను, బంధువులను త్యజించి సంపదనూ, సమస్త రాజ్యాన్ని త్యాగంచేసి ఐచ్ఛికంగా ఆనందంగా అడవి ప్రాంతంలో కాలూని తిరుగాడితివి కదా బుద్ధదేవా!

**ద్వేష రాగములను వేషాలు వేయుచు**
**భూషణములతోడ పోషణముగ**
**శోష లేక తిరుగు వేషగాండ్రకు మంచి**
**బుద్ధిచెప్ప నేర్తు! బుద్ధదేవ! (51)**

తా: భూషణ సత్కారాలకు మురిసి, రాగద్వేషాలతో విషయలంపటులై ఏకొంచెమైనా శరీరశ్రమకు ఓర్వలేక ఎప్పటికప్పుడు వేషాలు మార్చేవారికి గుణపాఠం నేర్పినావు కదా బుద్ధదేవా!

**ప్రాణరహితమైన ఱాళ్ళకుఁ బ్రాణముల్**
**చేర్చి రాంధ్ర బౌద్ధ శిల్పవరులు**
**దేశ దేశములను దేజరిల్లుచు నుండె**
**సిద్ధశిల్పమగుట! బుద్ధదేవ! (52)**

తా: దేశ విదేశాలలో మన ఆంధ్ర బౌద్ధశిల్పులు ప్రాణంలేని బండరాళ్లను శిల్పాలుగా మలచి ఘనకీర్తి గడించి నీ సేవ చేసినారు బుద్ధదేవా!

---

ఇతరుల్ని జయించడం కంటే తనని తాను జయించడం చాలా కష్టమైన పని.

**అఖిల దేశములకు నాలవాలంబుగా**
**దైవమతుల చెలఁగి చేవఁగూర్చు**
**బుద్ధదేవుఁ గొలువ పుణ్యముల్ ప్రాప్తించు**
**విశ్వప్రేమ శాంతి వెలయు బుద్ధ! (53)**

తా: ప్రపంచ దేశాలలో కీర్తిగడించిన బౌద్ధ శిల్పకళాకారుల ద్వారా ధర్మం వ్యాప్తికి కారణమైన బుద్ధ దేవా! నిన్ను కొలుచు వారికి పుణ్యం, నీ బోధల ద్వారా విశ్వశాంతి, మానవాళి పట్ల ప్రేమ వర్ధిల్లును.

**మంచిదృష్టిపథము మంచి యాలోచన**
**మంచిమాట కర్మ మంచిదిగను**
**మంచి జీవితంబు మంచి వ్యాయామమ్ము**
**మంచి స్మృతి సమాధి మించు బుద్ధ! (54)**

తా: మంచి దృక్పథం(సదాశయం) మంచితలపు, మంచి పలుకు, మంచి కార్యం, శరీర వ్యాయామంతో కూడిన క్రమబద్ధ జీవితం యోగులు ప్రవచించే సిద్ధ సమాధి కంటె గొప్పది కదా బుద్ధా!

**పువ్వులందుఁ దేనె నువ్వుల నూనెయుఁ**
**బాల వెన్న, శోభ బాలభాను**
**నందుఁగూడి యున్నయట్టు లీ విశ్వమ్ము**
**ప్రకృతి శక్తిలోనఁ బరఁగు బుద్ధ! (55)**

తా: బుద్ధదేవా! పాలలో వెన్న, పువ్వుల్లో తేనె, నువ్వులలో నూనె సూర్యునిలో కిరణాల శోభ అంతర్లీనమైయున్నట్లు సమస్త విశ్వం ప్రకృతి (నిసర్గ) శక్తిలోనే (తోనే) ప్రవర్తిల్లుతోంది.

**పంచశీలములును నంచిత చతురార్య**
**సత్యములు ప్రచార సరణిఁ దీర్ప**
**సర్వశుభము లబ్బి స్వామ్యమ్ముగా భువి**
**విశ్వశాంతి గలిగి వెలయు బుద్ధ! (56)**

తా: నీవు ప్రబోధించిన పంచశీలములు, "చతురార్య" సత్యముల మార్గంలోనే సర్వశుభములు ఒనగూరి ప్రజాస్వామ్య ప్రగతి, విశ్వశాంతి వర్ధిల్లును బుద్ధదేవా!

---

**శాంతిబోలునట్టి స్వర్గంబు ధర లేదు**
**దాంతి మిన్నఁ దలఁప క్రాంతికన్న**
**శాంతి యున్నయట్టి జనుఁడు విశ్వంబున**
**యశము గాంచుచుండు నౌర! బుద్ధ! (57)**

తా: భౌతిక పురోగమనం కంటె తపఃక్లేశాదులను ఓర్చుకోగల గుణం(దాంతి) గొప్పదని, శాంతిని మించిన స్వర్గం లేదని శాంతుడైన మానవుడు లోకంలో చిరకీర్తి పొందుతాడని చాటినావు మహానుభావా!

**తథ్యమిథ్యానువాదమ్ము దవిలి జనులు**
**దేవతల పుట్టుకకు దారి తీసినారు**
**కల్ల నిజము లెఱుంగక యెల్లవారు**
**పరుగులిడఁజొచ్చి రీ త్రోవఁబట్టి బుద్ధ! (58)**

తా: సత్యాన్ని మరచి, మిథ్య (మాయ) వెంటనడిచే మానవులు నిరర్ధక విగ్రహారాధనకు బానిసలైపోయారు. ఆ దారిలో నిజమేదో కల్ల ఏదో గ్రహించక మానవాళి పరుగు తీస్తున్నారు బుద్ధదేవా!

**నిర్వికారుఁడు నిత్యుఁడు నిఖిలమయుఁడు**
**భిన్న భిన్న జగమ్ముల నున్న వాఁడ**
**టన్న వాదాల దోషపుం దెన్ను లెన్ని**
**శూన్యమని చాటినాఁడవు మాన్యబుద్ధ! (59)**

తా: నిత్యుడు, నిర్వికారుడు అయిన పరమాత్మకు భిన్న భిన్న రూపాలను, భిన్న భిన్న లోకాలను సూచించే వాదంలోని దోషాలను చూపి అట్టి వాదాలలోని నిరర్థతకతను చాటి చెప్పినావు మాన్యవర్యా!

**శాంతచిత్తుండు సౌహార్ద్ర సరళమూర్తి**
**సత్యపాలకుఁ దమృత నిష్యంద మయుఁడ**
**నంతశక్తి మయాత్మకుం దఘవిదూరుఁ**
**డతనిఁ గొల్చిన పాపము లణఁగు బుద్ధ! (60)**

తా: శాంతమూర్తి, స్నేహశీలి, భక్తసులభుడు, సత్యపాలకుడు, అమృతమయుడు, అనంత శక్తియుతుడు, పాపరహితుడు అయిన బుద్ధుని కొలుచుట వలన మానవుని పాపం నశిస్తుంది.

**బుద్ధదేవుని సురుచిర శుద్ధమూర్తి**
**భావమున నిల్ప నణఁగును బాపమెల్ల**
**ధన్యమగు మానవుని జీవితంబు ధరణి**
**విశ్వశాంతియుఁ బ్రేమయు వెలయు బుద్ధ! (61)**

తా: బుద్ధదేవా! అంతశ్శుద్ధి కలిగి పవిత్రుడవైన నిన్ను భావంలో నిల్పువాని పాపం నశిస్తుంది. అట్టివాని జన్మ ధన్యమవుతుంది. ప్రపంచాన శాంతి విలసిల్లుతుంది!

**జనన మరణంబు లందున నణఁగిపోవు**
**క్షణిక జగమున కెపుడు శాక్యర్షి యల త్రి**
**పిటకముల లెస్సఁ జదువ వివేకమబ్బు**
**విశ్వప్రేమయు శాంతియు వెలయు బుద్ధ! (62)**

తా: జననమరణాలతో కూడిన ఈ జగత్తు క్షణికమని, బౌద్ధ సూత్రాలైన "త్రిపిటకముల"ను చదివితే వివేకం కల్గుతుందని, ప్రేమ, విశ్వశాంతి వర్ధిల్లుతాయని చాటినావు మహాత్మా!

**శాశ్వతాశాశ్వతంబులు విశ్వమందు**
**హేతువాద బద్ధంబులై యెసక మెసఁగ**
**భౌతికావలి భ్రమణమ్ము పరిఢవిల్లు**
**జగతి నుల్లోల జలధిరీతిగను బుద్ధ! (63)**

తా: ప్రపంచంలో దృగ్గోచరమయ్యే వివిధ విషయాలను శాశ్వతంగానో లేక ఆశాశ్వతంగానో భావింప చేసే కేవల భౌతిక హేతువాదం సముద్రంలోని అలజడి (కల్లోలం) లాంటిదని చాటినావు బుద్ధదేవా!

**వెల్లివిరిసిన చందాన నెల్ల ప్రజలు**
**పాపపంకంబు మీ పుణ్య పాదజలము**
**వలన కడుగుడటంచును సలలితముగ**
**మూగుచుందురు నిరతమ్ము బుద్ధదేవ! (64)**

తా: మహానుభావా! తమ పాపపంకిలాన్ని ప్రక్షాళన చేసుకొనుటకు పరమ పావనమైన నీ పాద జలం కోసం మానవులు తహతహలాడుతుంటారు కదా!

---

**తప్పు దారి పట్టిన మనస్సు కంటే పెద్ద శత్రువు లేదు.**

**లక్షలాది భిక్షువులను లాలితముగ**
**నక్షయంబగు ధర్మంబు నమరునట్లు**
**బోధసల్పిన మహనీయ పుణ్యమూర్తి**
**సౌమ్యగంభీరమూర్తి! దీక్షాతపస్వి! (65)**

తా: సౌమ్య గంభీరమూర్తీ! దీక్షాతపస్వీ! బుద్ధదేవా! లక్షలాది బౌద్ధ బిక్షువులను క్షయంలేని ధర్మమార్గంలో నడవడానికి జ్ఞాన బోధనిచ్చిన మహనీయ మూర్తివి!

**బుద్ధదేవుని జాతిని బుట్టినావు**
**భూతదయను నహింసనుబూని నీవు**
**మధుర కరుణారసైక తన్మయుఁడవగుచు**
**ధర్మతత్త్వ మనుష్ఠింపఁదగును బుద్ధ! (66)**

తా: శాక్య వంశంలో జన్మనెత్తి వెల్లువైన భూతదయతో అహింసావ్రతం చేపట్టినావు మహాత్మా! కరుణారసార్ద్ర హృదయుడవై అహర్నిశలు ఆధ్యాత్మిక తన్మయత్వంలో మునిగినావు కదా స్వామీ!

**పరుల కుపకార మొనరింప సుకృతమనియు**
**పరులకపకార మొనరింప పాపమనియు**
**గ్రంథరాజము లన్నియుఁ గలయఁబలుకు**
**శాక్యసింహ! తథాగత! శాంతమూర్తి! (67)**

తా: ఇతరులకు కీడు చేయుట పాపమని, మేలుచేయుట పుణ్యప్రదమని శాంతి కాముకుడవైన నీవు చాటిన సత్యాన్నే విశ్వంలో సమస్త గ్రంథాలు వక్కాణిస్తున్నాయి తథాగతా!



**బుద్ధదేవుని సూక్తిలో భూతదయయు**
**బుద్ధదేవుని పుణ్యంపు మూర్తియందు**
**తాండవించును ప్రేమ సత్యంబు కరుణ**
**బుద్ధదేవుని మతమును బూనుఁడయ్య! (68)**

తా: బుద్ధుని సూక్తులలో భూతదయ తొంగిచూస్తుంటుంది. బుద్ధుని దివ్యమంగళ రూపంలో సత్యం, కరుణ, ప్రేమ తొణికిసలాడుతుంటాయి. అట్టి బుద్ధుని మతం ఆదరణీయం.

---

**కోసలాదేవి స్వీకారగుణము పేర్మి**
**బింబిసార మహీపాలు ప్రేమనంది**
**భారతావనిఁ బ్రాకె నీ బౌద్ధమతము**
**బుద్ధదేవుని మతమును బూనుఁడయ్య! (69)**

తా: కౌసలాదేవి ఆదరణను, బింబిసారుని ప్రేమను ఒడినిండా నింపుకున్న బౌద్ధం సదా విశ్వమంతటా ఆదరణీయం.

**బౌద్ధసిద్ధాన్తములఁ దన పాలనమున**
**సంతరించుటే కాక సీమాంతరముల**
**సార్వభౌముం డశోకుండు పర్వఁజేసె**
**బుద్ధదేవుని మతమును బూనుఁడయ్య! (70)**

తా: బౌద్ధ సిద్ధాంతానుసారం భరతదేశంలో పరిపాలన గావించుటేకాక ఇతర దేశాలకు బౌద్ధాన్ని అశోకచక్రవర్తి వ్యాప్తి చెందించినాడు. అట్టి బౌద్ధం ఆదరణీయం.

**సత్యమును ధర్మమును నహింసయును మూటి**
**నర్చన మొనర్చి గాంధీ మహాత్ముఁ డిపుడు**
**విశ్వసందేశ మయ్యె నీవిధము నేఁడు**
**బుద్ధదేవుని మతమును బూనుఁడయ్య! (71)**

తా: బుద్ధుని అహింస, సత్యం, ధర్మం మహాత్మాగాంధీకి శిరోధార్యమైనాయి. అవే నేడు విశ్వమంతా ఆదర్శమయినాయి. అట్టి బౌద్ధం ఆదరణీయం.

**ఆయుధ విసర్జనము చేయుటర్హమనుచు**
**ఖండఖండాంతరముల నఖండ యశము**
**నిలిపె జహ్వారుఁ డీముద్ర కలిమిచేత**
**బుద్ధదేవుని మతమును బూనుఁడయ్య! (72)**

తా: బుద్ధుని మతానుసారమే ఆయుధాలు ప్రపంచ వినాశకరమని జవహర్ లాల్ నెహ్రూ ఖండ ఖండాంతరాలలో ప్రబోధించినాడు. అందువల్లే నేటికీ బౌద్ధం ఆదరణీయం.

**జాతిమత కక్ష లుడుపగాఁ జక్రమిద్ది**
**సామ్యవాదము నిల్పగాఁ జక్రమిద్ది**
**సత్యము శివమ్ము నౌ ధర్మచక్ర మిద్ది**
**బుద్ధదేవుని మతమును బూనుఁడయ్య! (73)**

తా: జాతుల, మతాల మధ్య కక్షలకతీతంగా, సమాజంలో సామ్యవాదాన్ని పరిపుష్టం చేసేదిగా సత్యానికి , జగత్కల్యాణానికి, ప్రతి రూపమైన ధర్మచక్రం బౌద్ధానికి ప్రతీక.

**బౌద్ధ సిద్ధాన్తములు దిశల్ పర్వుగాత**
**నిత్యమై సత్యము నహింస నిల్చుగాత**
**జాతిమత కక్ష లన్నియు సమయుగాత**
**ధారుణికి నిండుమేలు చేకూరుఁగాత! (74)**

తా: బౌద్ధ సిద్ధాంతాలు నలుదిశలా వ్యాప్తిచెంది సత్యమెల్లప్పుడూ ఆదర్శమై వెలుగుతూ జాతిమత కక్షలన్నీ సమసిపోయి బౌద్ధ మతావలంబన ద్వారా సమస్త విశ్వానికే మేలు చేకూరు గాక!



**సత్యమె రక్షణ మరయఁగ**
**సత్యమె కడు కీర్తిదెచ్చు సజ్జనునకు నా**
**సత్యమె గొప్పది యన్నిఁట**
**నిత్యము వచియింప శుభము నెగడును బుద్ధా! (75)**

తా: సత్యం మనిషికి రక్షణ కవచం. సత్యవ్రతం సదా కీర్తిదాయకం. సత్యమే పరమోత్కృష్టమని చాటి చెప్పడం ప్రపంచానికి సకల శుభాలను చేకూర్చే జీవనసూత్రం.

**చెడుకార్యమ్ములు సేసిన**
**జడుఁడని వచియించు జగతి చండాలు డనున్**
**బడుగుగఁ జేయును ధనదుని**
**విడువుఁడి చెడు బుద్ధులెల్ల వేగమె బుద్ధా! (76)**

తా: చెడుపనులు చేయువారికి ఎప్పటికయినా లోకనింద తప్పదు. చెడుమార్గము కుబేరుణ్ని బికారిని చేయగలదు. చెడు బుద్ధిని విడనాడడం సదాశ్రేయస్కరం.

**కనుఁగొన్న సకల జనులకు**
**తనువొకటే భేదమేమి ధర లేదనుచున్**
**మనమున దలఁచుచు మెలఁగును**
**ఘనుఁడగు పురుషుండు కీర్తి గాంచును బుద్ధా! (77)**

తా: శరీరధారులందరి దేహనిర్మాణం ఒకేవిధమని మనుషుల మధ్య తారతమ్యాన్ని చూడకూడదన్న ఎరుక గలిగి చరించువాడు ఉత్తముడు.

**ఎదుటను సత్యము బలికియు**
**బిదప నసత్యంబు పలుకు వెఱ్ఱిని లోకుల్**
**మదిలోన నీసడింతురు**
**గదియంగా నీయ రీ జగమ్మున బుద్ధా! (78)**

తా: ముందొక మాట వెనుకొక మాట పలికే వ్యక్తి జీవనం పతనానికి దారి తీస్తుంది. నీచవర్తనుడు లోకం ఈసడింపుకు గురికాక తప్పదు.

**ఏ యెండకు నా గొడుగును**
**నేయముగాఁ బట్టునట్టి నేర్పరులను ఛీ**
**ఛీయని లోకము తిట్టును**
**మాయికుఁ డనుచుండు సుజన మందలి బుద్ధా! (79)**

తా: ఏ ఎండ కాగొడుగు పట్టే మాయగాడిని లోకం ఛీకొట్టక మానదు. సుజనులు దుష్టులకు దూరంగా ఉందురు.

**భోగాసక్తుం డనుచును**
**భోగములను మునిఁగి తేలు పురుషుని గని యు**
**ద్యోగమ్ము లేని దుష్టుఁడు**
**వాగాడంబరముతోడ వదరును బుద్ధా! (80)**

తా: దుష్టుడు నోటిని అదుపులో ఉంచుకోక ఉన్నతులపై నిందలు వేస్తుంటాడు. నిరుద్యోగి సౌఖ్యాలనుభవించేవారిని నిందిస్తూ పురుషప్రయత్నం చేయక అసూయతో జీవిస్తుంటాడు.

**దుష్టులతో స్నేహంబును**
**శిష్టులు గావించిరేని చెడి వారంతన్**
**దుష్టులుగ మాఱుచుందురు**
**కష్టమ్ముల నందుచుంద్రు ఘనముగ బుద్ధా! (81)**

తా: చెడు సావాసము వలన సజ్జనులు కూడా దిగజారి పోతారు. సజ్జనుడైన వాడు దుష్టునితో స్నేహం చేయరాదు.

**ఱాళ్ళకు రప్పకు మ్రొక్కుచు**
**నుల్లంబునఁ దనివి సనక యూగిసలాడన్**
**జెల్లును గాలము; ఫలమా**
**పొల్లగు నుల్లాస మడఁగు బుడమిని బుద్ధా! (82)**

తా: చిల్లరరాళ్లకు మొక్కుతూ కాలయాపన చేసే మనిషి ఫలితం పొందలేక మనుగడసాగిస్తూ మానసిక ఆనందాన్ని కోల్పోయి అశాంతిలో మునుగుతాడు.

**వ్యర్థమగు శాస్త్రజాలము**
**నర్థమ్మును విడిచి చదువ నడి మేలౌనా!**
**సార్థముగ హేతు యుతముగ**
**నర్థిని బఠియింప మేళులందును బుద్ధా! (83)**

తా: అర్థంకాని శాస్త్రాధ్యయనం నిరుపయోగమైనది. సారయుతము, హేతుబద్ధము అయిన జ్ఞానము వ్యక్తికి శ్రేయస్కరమని బుద్ధ సూక్తి !

**ధనమెల్లఁ గొల్లవెట్టియు**
**ఘనముగ యజ్ఞమ్ము చేయఁగలుగునె సుఖముల్**
**తను మనముల శుద్ధుండగు**
**జనుఁ గొల్వగ సుఖములబ్బు సత్యము బుద్ధా! (84)**

తా: ధనాన్ని వెచ్చించి యజ్ఞయాగాలను మాత్రమే నమ్మి పురుష ప్రయత్నం విడనాడే వారికి సౌఖ్యమబ్బదుగదా! ఏ కల్మషంలేని నిర్మల మనస్సున్ని నమ్మితే శుభం కలుగునని బుద్ధ సూక్తి!

---

**సంసారసాగరము వి**
**ధ్వంసము గావించి యీద తరమే; ఘన వి**
**ద్వాంసునకునైనఁగాని య**
**హింసయు సత్యమ్ము ధర్మ మెన్నక బుద్ధా! (85)**

తా: సంసారమనే సముద్రాన్ని ఈదడం విద్యాంసులకైనా సులభం కాదు. సత్యాహింసలను ఆచరించుటే సంసార సౌఖ్యానికి దోహదమవుతుంది మహాత్మా!

**తృష్ణయె మూలము వనటకు**
**తృష్ణయె మూలంబు జనులు తెన్నులు దప్పన్**
**తృష్ణయె మూలమ్మంతకు**
**తృష్ణను విడనాడు వాఁడు ధీరుఁడు బుద్ధా! (86)**

తా: కోర్కె(తృష్ణ) యే శోకానికి కారణం. కోరికలే జీవితంలో కష్టాలకు హేతువులు. కోర్కెలను త్యజించువాడు నిజమైన ధీరుడు.

**దుఃఖము సంసారంబును**
**దుఃఖము కూపంబు నాత్మ దుఃఖమె ఘనమౌ**
**దుఃఖము సుజనుల జంపును**
**దుఃఖము** సమమౌచు నెద్ది తూగదు బుద్ధా! (87)

తా: కోర్కెల సాధనలో దుఃఖం సంసారాన్ని నరక కూపంలో పడదోసి సజ్జనులను అంతం చేస్తుంది. మనసులో దుఃఖాన్ని అనుభవించే వాడు ఆశాంతికి గురై పతనమవుతాడు.

**గంగాస్నానము చేసిన**
**చెంగున వ్రతము లవి యెన్ని చేసిన మణి పో**
**వంగలవే పాపంబులు**
**చెంగట సత్యమ్ములేక చెలువుగ బుద్ధా! (88)**

తా: గంగానదిలో స్నానం చేసి వ్రతాలు చేసినప్పటికీ సత్యాన్ని విడనాడిన వాడు పాపాన్ని పోగొట్టుకోలేడు.

**స్ఫీతంబగు మారుత మే**
**రీతిని గదలింప లేదొ రెక్కొను గిరి; నా**
**రీతిని ధీమంతుని మది**
**నేతఱి గదలింపలేఁడు హీనుఁడు బుద్ధా! (89)**

తా: గాలి ఎంత అధికంగా వీచినప్పటికీ కొండను ఎలా కదిలించలేదో నిజమైన ధీమంతుని ధృతిని హీనుడు చలింప చేయలేడు.

**నాటకమీ జగ మెల్లను**
**బూటకమై క్రాలుచుండు వుచ్చినపండై**
**దీటుగ దాని నెదిర్చియు**
**రాటుగఁ జరియింపవలయు రమణగ బుద్ధా! (90)**

తా: ఈ జగమొక నాటకం, ప్రతి పాత్రధారి ఏదో ఒక గాయంతో బాధపడుతుంటాడు. ధీటుగ ఎదిరించి నేర్పు, ఓర్పు వహించువాడే ఈ జగన్నాటకాన్ని రక్తి కట్టిస్తాడు.

**గర్వమ్ము గూడ దెవనికి**
**గర్వముగల యట్టి వానికడఁ గష్టంబుల్**
**సర్వ మ్మొకపరి చేరియు**
**గర్వితుని మనమ్మునెంతొ కలఁచును బుద్ధా! (91)**

తా: గర్వంగల వ్యక్తి కష్టాల పాలుగాక తప్పదు. తెచ్చుకున్న కష్టాల మూకుమ్మడి దాడిలో గర్వపోతు క్రుంగిపోతాడన్న సత్యాన్ని గ్రహించవలయును.

**స్వర్గము స్వర్గమ్మని బుధ**
**వర్గము బోధించుచుండు; స్వర్గముగలచో**
**భర్గుఁడు భిక్షంబెత్తఁగ**
**స్వర్గము దిగివచ్చి తిరుగవలెనో? బుద్ధా! (92)**

తా: స్వర్గ సౌఖ్యాల కొరకు బుధవర్గం సైతం వెంపర్లాడడం జగద్విదితం. శివుని భిక్షాటనలోని అంతరార్థం ఎరిగిన మనస్సు భోగలాలసకు దూరంగా ఉంటుంది.

---

**మనసే మూలము వనటకు**
**మనసే మూలమ్ముగాదె? మహిమకు నిలలో**
**మనసే మూలము కోర్కులు**
**జనునకు జనియించుటకును సతతము బుద్ధా! (93)**

తా: కోర్కెల పైని మనస్సు దుఃఖానికి మూలం. కోర్కెలు పుట్టడానికి మనిషిలోని మనసే కారణం. అందుకే యోగమార్గంలో మనస్సును నియంత్రించిన వాడే సచ్చిదానందాన్ని పొందగలడు.

**విశ్వంబె మనము; మనమే**
**విశ్వంబునుగాన ప్రజలు వివరంబుగ నా**
**విశ్వపు మర్మము లెఱిఁగిన**
**శాశ్వత సౌఖ్యంబు లందు జగతిని బుద్ధా! (94)**

తా: విశ్వం అంతులేనిది. అలాగే మనస్సు కూడా అనంతమైనది. ఈ మర్మాన్ని గ్రహించినవాడే ఈ అనంతానంత విశ్వంలో మనోవికారాన్ని జయించి చిరంతనమైన, నిత్యమైన, నిర్వికల్పమైన ఆనందానుభూతి నొందగలడు.

**ప్రకృతిగన జిత్రమైనది**
**వికృతిగను మెలఁగుచుండు పృథ్విని ప్రజలున్**
**ప్రకృతి రహస్యంబును నా**
**వికృతిని బరమార్థ మెఱుగ వెలయును బుద్ధా! (95)**

తా: ప్రకృతి చిత్రవిచిత్రంగా గోచరిస్తుంది. ప్రకృతిలోని వికృతిని సైతం గ్రహించి ప్రకృతిలోని నిసర్గ రహస్యాలను ఛేదించగలిగితే మనిషిని పరమార్థం(పరమాత్మ తత్త్వం) సాక్షాత్కరిస్తుంది.

**భవసాగర తరణమునకు**
**నవనిని సుజ్ఞాన నౌక యనవరతంబున్**
**భువిగల యజ్ఞానమునకు**
**నవిరళమగు తరణి నీతి; యరయఁగ బుద్ధా! (96)**

తా: సంసారమనే సాగరాన్ని దాటుటకు సుజ్ఞానమనే నౌక అవసరం. అజ్ఞానపు కెరటాలనధిగమించి ఒడ్డు చేరడానికి ఇంతకంటే మేలైన తరుణోపాయం మరొకటి లేదు.(తరణి =ఓడ)

---

**పుక్కిటి పురాణముల మదిఁ**
**జిక్కఁగఁ బఠియించి భజన సలిపెడి మందుల్**
**దిక్కుల మెండై పాపపు**
**ద్రొక్కిళ్ళంబడి నలంగుదురుగద బుద్ధా! (97)**

తా: పుక్కిటి పురాణాల్లో నిరర్థకంగా కాలయాపన చేసేవారు చిత్తశుద్ధి లేకుండా భజనలు చేసేవారు చిక్కుల్లో బడి తమను తామే కోల్పోయి మూర్ఖులై కడతేరుతారు.

**గీర్వాణభాష మన యం**
**తర్వాణుల శుద్ధిసేయఁదగియెడు మని యీ**
**సర్వప్రజలకుఁ జెప్పుదు**
**రుర్వీసురు లెల్ల బిడియ మొందక బుద్ధా! (98)**

తా: గీర్వాణ భాష (సంస్కృతం) అంతరంగాలను వృద్ధి చేస్తుందని ప్రచారం చేసే బ్రాహ్మణులు చిత్తశుద్ధిలేని అర్చనలలో జీవితాలను వ్యర్థపరచుకోకూడదు గదా బుద్ధా !

**అమరావతి యెల్లోరా**
**విమలంబగు చోటులందు విఖ్యాతిగనెన్**
**రమణీయమ్మగు శిల్పము**
**సమకూర్చి యశంబు భరత జాతికి బుద్ధా! (99)**

తా: అమరావతి, ఎల్లోరా మొదలైన ప్రాంతములలో శిల్పకళ పరిఢవిల్లి బౌద్ధ మతానికి ప్రపంచ ఖ్యాతినిచ్చింది కదా మహాత్మా!

**వేదములు సత్యమనుచును**
**వాదించెడి శుష్క ధర్మపరుల విధమ్ముల్**
**రోధించి సత్యమార్గము**
**సాధించిన జనుఁడ నీవె జగతిని బుద్ధా! (100)**

తా: వేదాలు సర్వకాలీన సత్యాలని విశ్వసించేవారి అభిమతాన్ని వ్యతిరేకించి నీదైన యోగమార్గంలో భౌతిక సౌఖ్యాలను త్యజించి జన్మ సాఫల్యాన్ని సాధించినావు కదా తథాగతా!

**బుద్ధుని శరణము నందుము**
**బుద్ధుని సంఘంబు శరణు పొందుము నీవా**
**బుద్ధుని ధర్మము నిల సం**
**సిద్ధుఁడవై దిశల వెలయఁ జేయుము బుద్ధా! (101)**

తా: బుద్ధుని శరణం పొందుము. బుద్ధ సంఘంతో శరణం పొందుము. బుద్ధుడు విశ్వసించి ప్రచారం చేసిన ధర్మాన్ని నలుదిశలా వ్యాప్తి చేయడానికి నీవంతు కర్తవ్యం సదా ఆచరణీయం. అభిలషనీయం. లోక కల్యాణ కారకం.

(సమాప్తం)



# కృతజ్ఞతాభివందనాలు!

మా ఈ పయత్నానికి సహకరించిన విజ్ఞులు, విశిష్టవ్యక్తులు ప్రశంసాత్మక పాత్ర పోషించినవారెందరో మహానుభావులు.

బుద్ధభూమి సంపాదకుడు, కవి, రచయిత, సామాజిక కార్యకర్త శ్రీ **బొర్రా గోవర్ధన్** గారు "బుద్ధోపదేశం" పద్యకావ్యం బౌద్ధధర్మామృతాన్ని ప్రతిపద్యంలో చిలికించారని, బౌద్ధము భారతదేశ సామాజిక విప్లవకెరటమని హృద్యంగా అభివర్ణించారు. వారికి కృతజ్ఞతాభివందన మందారమాలలు.

ఆంధ్రప్రదేశ్ మాజీ ఉపసభాపతి, మాజీ మంత్రి, ప్రపంచ తెలుగు రచయితల సంఘం గౌరవ అధ్యక్షుడు డాక్టర్ **మండలి బుద్ధప్రసాద్** గారు బుద్ధోపదేశం పద్యరచనపై తమ అమూల్యమైన సందేశాన్ని బుద్ధుని బోధనల సారాంశాన్ని ముఖ్య సూత్రాలను ప్రస్తుతిస్తూ నేటి సమాజంలో మానవ మనుగడకు ఇదే తరుణోపాయమనే అభిప్రాయాన్ని "అభినందన" ద్వారా వెలిబుచ్చినందులకు వారికి మా హృదయ పూర్వక నమస్సుమాంజలులు.

సుపరిచితులు సాహితీ మిత్రులు **చీకోలు సుందరయ్య** గారి ద్వారా పరిచయభాగ్యం కలిగి బుద్ధోపదేశంలోని పద్యాలకు సరళంగా హృద్యంగా తాత్పర్యం వ్రాసి అతితక్కువ సమయంలో అంకితభావంతో సమర్పించిన కవి, రచయిత శ్రీ **అవధానం టి.హెచ్. నటరాజారావు**కి మా హృదయపూర్వక శుభాభినందనలు.

నేటి తరం యువకుడు, మేధావి, తెలుగుభాష అభ్యున్నతికి వికాసానికి వైజ్ఞానిక రంగములో ఇతోధికంగా కృషి చేస్తున్న శ్రీ **షేక్ రహ్మానుద్దీన్** గారు అడిగినదే తడవుగా ఈ "బుద్ధోపదేశం" శతక నూతన ప్రచురణకు సంపూర్ణ సహాయ సహకారాలందించి సకాలంలో సుందరంగా తీర్చిదిద్ది అమ్మాఫౌండేషన్ పబ్లిషర్స్, విశాఖపట్నం ద్వారా ముద్రించి అందించినందులకు వారికి మా హృదయపూర్వక ధన్యవాదములు.

— కుటుంబసభ్యులు

# హృదయస్పందనా స్మృత్యంజలి

మా తండ్రిగారు కీ.శే. కోగంటి నరసింహా రావు తెనాలి తాలూకా అమర్తలూరు మండలం వామనగుంటపాలెం గ్రామంలో ఒక సామాన్య రైతు కుటుంబంలో పుట్టి ఉమ్మడికుటుంబ సంప్రదాయాలకు విలువలిస్తూ కోగంటి కుటుంబ వారసత్వ అభ్యుదయ భావాలను సామాజిక స్పృహను పుణికిపుచ్చుకుని తెలుగుభాషలో విద్యనభ్యసించి విద్వాన్, పండిట్ కోర్సులు చేసి తెలుగు, సంస్కృతము, హిందీ భాషల్లో ముప్పది సంవత్సరముల పైన వివిధ జిల్లా పరిషత్ హైస్కూళ్ళలో ఉపాధ్యాయుడిగా పనిచేసి ఆధ్యాత్మికతను, మానవతావాదాన్ని మేళవించిన బుద్ధుని సిద్ధాంతాలను నమ్మి సమాజ శ్రేయస్సుకై అహోరాత్రులు తపన పడి ఎందరో హృదయాల్లో తనదైన శైలిలో సుస్థిరస్థానం సంపాదించారు.

మా తల్లి కీ.శే. శ్రీమతి రాజ్యలక్ష్మి ఎనిమిది మంది సంతానానికి -ఐదుగురు కుమార్తెలకు, ముగ్గురు కుమారులకు - జన్మనిచ్చి, భర్త అభిప్రాయాలకు విలువనిచ్చి, ప్రేమానురాగాలు పంచి, కుటుంబాన్ని ఎన్నో కష్టానష్టాలకోర్చి సభ్యతాసంస్కారాలను నేర్పి, అభ్యుదయ భావాలతో పెంచి, మా కాళ్ళమీద మేము నిలబడి ధైర్యంగా బ్రతకగలిగే ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దారు.

వారి బిడ్డలుగా జన్మించటం మేమెంతో అదృష్టంగా భావిస్తూ వారి ఆశలను, ఆశయాలను బ్రతికిస్తూ సమాజం కోసం మా వంతు కృషి చేయాలని తలంచి, వారు సుమారు 65 సం|| క్రితం బుద్ధుని సిద్ధాంతాలను, సూక్తులను ప్రజలలో వ్యాప్తి చేసే ఉద్దేశ్యంతో వ్రాసిన ఈ "బుద్ధోపదేశం" శతకానికి తాత్పర్యం పొందుపరచి నూతన ముద్రణతో అందించగలగటం మాకు ఆనందం, గర్వకారణము.

<u>కుమార్తెలు</u>
కోగంటి ఉషారాణి, కోగంటి శాంతిశ్రీ
కోగంటి వసుమతి, కోగంటి విశ్వమిత్ర
<u>కుమారులు</u>
కోగంటి అశోక్ కుమార్
కోగంటి లెనిన్ బాబు
& మా ఆత్మీయ కుటుంబ సభ్యులు

# శిష్యగణ ఘననివాళులు

"మన గురువరేణ్యులు శ్రీ **కోగంటి నరసింహా రావు**"

మూడు దశాబ్దముల పాటు విద్యావ్యాసంగంతో తమ అమూల్యములైన ఉన్నత లక్ష్యసిద్ధి, వినూత్న విమర్శనా చమత్కృతి, ప్రగతి పథ ప్రేరణతో, సరసవచోమాధుర్య బోధామృత తరంగములనోలలాడించి ఎందరో విద్యార్థులను సంస్కార పరాయణులుగా, ఆదర్శ పౌరులుగా తీర్చిదిద్దిన ఆదర్శోపాధ్యాయులు!

విశిష్టములైన బౌద్ధ మానవతాభ్యుదయ విప్లవోపాధ్యాయ ఉద్యమాలకు సంగమమై తాత్విక ద్రష్టగా చైతన్య స్రవంతిగా భాసిల్లిన మహామనీషులు!

నిస్వార్థం, నిర్భీతి, సేవాతత్పరత, సంస్కారము, సామరస్య-సమత్వాది గుణగణంబులకాలవాలమై, ఉజ్వల జాతిభవితవ్యానికై మానవతా విలువలు ప్రోది చేయుటకై సాంస్కృతిక విప్లవోద్యమ చైతన్య పురోగాములుగా జీవితయాత్ర సాగించిన చైతన్యమూర్తులు!




## రచయిత-పరిచయము

శ్రీ కోగంటి నరసింహారావు గారు విద్వాన్ తెలుగు హిందీ సంస్కృతము పండిట్. అమర్తలూరు మండలం తెనాలి తాలూకా వామనగుంటపాలెం గ్రామంలో కోగంటి వెంకాయమ్మ, భుజంగరావు దంపతులకు జ్యేష్ఠ పుత్రుడుగా జన్మించారు. 'సత్యం' నరసింహా రావు గారుగా పేరొందారు.

1945లో సిరిపురం స్కూల్లో తెలుగు పండిట్‌గా బోధనావృత్తిని ప్రారంభించి పచ్చలతాటిపర్రు, వేటపాలెం, యడ్లపల్లి, అబ్బినేనిగుంటపాలెం, స్వర్ణ మొదలగు జిల్లా పరిషత్ స్కూళ్ళలో తెలుగుపండిట్ గాచేసి 1978లో పచ్చలతాడిపట్టు స్కూలు నుండి పదవీవిరమణ చేశారు.

- గొప్ప సామాజిక స్పృహగల కోగంటి కుటుంబ నేపథ్యంతో మేధావిగా, కవిగా ఎన్నో ఆదర్శవంతమైన కార్యక్రమాలు నిర్వహించారు.
- ప్రపంచమంతటా బుద్ధుని 2500 జయంతి వేడుకల జరుపుతున్న సందర్భంగా 1956 లో "బుద్ధోపదేశం" శతకంను రచించి వైశాఖపౌర్ణమి రోజున సమాజానికందించారు.
- "స్వేచ్ఛాపథం" దేశభక్తిగేయాల సంకలనం చేసి ప్రచురించారు.
- కవిరాజు-త్రిపురనేని రామస్వామి చౌదరి ఆదర్శాలననుసరిస్తూ జయంతి వేడుకలు ఘనంగా నిర్వహించారు.
- మూఢాచారాల్ని వ్యతిరేకిస్తూ నాస్తికవాదాన్ని హేతువాద దృక్పథాన్ని విస్తరించారు.
- మిత్రుల్లో, శిష్యబృందంలో సేవాదృక్పథాన్ని ప్రేరేపించి గాజువాక చైతన్యనగర్లో గౌతమబుద్ధ గ్రంథాలయం స్థాపనకు స్ఫూర్తిగా నిలిచారు.
- పచ్చదనం, పరిశుభ్రత, ఆరోగ్యసంరక్షణ, యువతలో నైపుణ్యాతా పెంపుదల మొదలగు విభిన్న సేవాకార్యక్రమాలకు నాంది పలికారు.
- బుద్ధుని తాత్విక ఆలోచన ద్వారానే శాంతి, సమసమాజస్థాపన సాధ్యమని తుదిశ్వాస వరకు గాఢంగా నమ్మి ఆధ్యాత్మికతా, మానవతా వాదాల్ని మేళవించి సమాజ శ్రేయస్సుకై అహోరాత్రులు తపనపడి ఎందరికో మార్గదర్శిగా తనదైన శైలిలో సుస్థిరస్థానం సంపాదించారు.
- నిజాయితీపరుడు, సంస్కారి, క్రాంతిదర్శి, మానవతావాది, నాస్తికుడు, అభ్యుదయవాది, జర్నలిస్టు, కమ్యూనిస్టు భావజాలంతో బుద్ధిష్టుగా మాలిన్యంలేని మహర్షిగా ఎదిగాడు.